# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసఁగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి:—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట,

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii అధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్రమొకటి రచించి ప్రచురించుట;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను వార్షికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట- ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపచరించు నన్ని కార్యములను జేయుట.